ఆంధ్రచంద్రికా గ్రంథమాల-౪.

ప్రాచీన

# ఆంధ్రనగరములు

(మొదటిభాగము)





గ్రంథకర్త:
ఆదిరాజు వీరభద్రరావు.

ఆంధ్రచంద్రికా గ్రంథమాల- ౮.

# ప్రాచీనాంధ్ర నగరములు

(మొదటి భాగము)

రచయిత:

ఆదిరాజు- వీరభద్రరావు

రిటైర్డు తెలుగు పండితుడు, చాదరుఘాటు కాలేజి,

కార్యదర్శి, శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి,

హైదరాబాదు-దక్కన్.

ప్రకాశకులు

ఆంధ్రచంద్రికా గ్రంథమాల.

సుల్తానుబజారు, హైదరాబాదు-దక్కన్

౧౯౫౦.

## రాజపోషకులు

౧. రాజా రామదేవరావు బహద్దరుగారు.

౨. రాజానాయని వేంకటరంగారావు బహద్దరుగారు.

౩. కొండా వేంకటరంగారెడ్డిగారు.





వెల. చందాదారులకు ౧—౮—0

వెల. ఇతరులకు ౨—0—0



పండిత:- ఆదిరాజు వీరభద్రరావు

# అంకితము

ప్రథమాంధ్ర గ్రంథాలయము
శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ స్థాపకులును,
శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి అధ్యక్షులును,
ఆంధ్రభాషా పోషకులును

అగు

## శ్రీ రాజానాయని వేంకటరంగారావు

బహద్దరు, మునగాల సంస్థానాధీశ్వరులవారికి
కృతజ్ఞతాపూర్వకముగ
సమర్పితము.

ఆదిరాజు వీరభద్రరావు.

# సంపాదకీయ భూమిక

ఆంధ్రచంద్రికా గ్రంథమాల నాలుగవ కుసుమముగా "ప్రాచీనాంధ్రనగరములు" అను గ్రంథమును అందజేయుటకు సంతసించుచున్నాము. ఈ గ్రంథమాలలో ఇదివరకు విస్మృత సామ్రాజ్యము, తెలంగాణా ఆంధ్రోద్యమము (మొదటి భాగము), ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము అనుమూడుగ్రంథములు వెలువడిన విషయము అందరకు, ముఖ్యముగా ఈగ్రంథమాల చందాదారులకు, తెలిసియే యున్నది.

"ప్రాచీనాంధ్రనగరము"లను రచించినవారు ఆదిరాజు వీరభద్రరావుగారు. వీరు జగమెరిగిన బ్రాహ్మణులు. హైదరాబాదు సంస్థానములో వీరనెరుగని సాహిత్య సేవకులులేరు. చాదర్ ఘాట్ హైస్కూలులో ప్రధానాంధ్రపండితులుగా చిరకాలము పనిచేసి, యీ మధ్యనే ఉపకార వేతనము తీసుకొని ప్రస్తుతము ఆంధ్రబాలిక ఉన్నత పాఠశాల (నారాయణగూడెము) లో పనిచేయుచున్నారు. మునగాల సంస్థానాధీశ్వరులు, శ్రీరాజానాయని వేంకటరంగారావు బహద్దరుగారు, కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు మున్నగువారలచే స్థాపించబడిఅనేక గ్రంథములనుప్రచురించిన విజ్ఞానచంద్రికాగ్రంథమాల కార్యనిర్వహణలో అధికాసక్తితో పనిచేసిరి. లక్ష్మణరాయ పరిశోధకమండలిలో ప్రధానకార్యకర్తలుగానున్నారు. వీరి వ్యాసములు ప్రకటింపబడని తెలుగు పత్రికల సంఖ్య

తక్కువ. గోలకొండ పత్రికలో అప్పుడప్పుడు ప్రచురింపబడిన తమ వ్యాసముల కొన్నిటిని ఆధారముగా గైకొని యీ గ్రంథమును సిద్ధముచేసినారు. తెలంగాణా ప్రాంతములో నున్న ప్రాచీనాంధ్ర నగరములను సామాన్య పాఠకలోకముదృష్టికి తెచ్చినారు. ముందుభాగములలో మరికొన్ని ప్రాచీన నగరములను గూర్చి ప్రస్తావించనున్నారు. ఆంధ్రుల ప్రాచీన ఔన్నత్యమును దెల్పు ఈ గ్రంథము అందరు చదువదగినది.

ఈ పుస్తకములో ప్రచురింపబడిన అలంపుర సంబంధపు రెండు బ్లాకులు ఇచ్చిన గడియారం రామకృష్ణ శర్మగారికిని, ఇతరనగరములకు సంబంధించిన ఏడు బ్లాకులిచ్చిన హైదరాబాదు ప్రభుత్వపురాతత్త్వశాఖవారికిని మాకృతజ్ఞతలు అందఁజేయుచున్నాము. గ్రంథపునర్ముద్రణలో అన్ని నగరములకు సంబంధించిన పటములు వేయుదుమని మనవిచేయుచున్నాము.

అతిస్వల్పకాలములో ముద్రణకార్యము పూర్తిచేసి మాకు తోడ్పడిన శ్రీ వాణీ ప్రెస్ యజమానులు అప్పారావు గారికి మా ధన్యవాదములు.

నూకల నరోత్తమరెడ్డి, ఎం. ఎ.
సంపాదకుడు.

# ప్రస్తావన



"ఆంధ్రదేశమును గుఱించియు, నాంధ్రరాజులను గుఱించియు, నాంధ్రవాఙ్మయమును గుఱించియు నెక్కుడు పరిశోధనలు చేసి క్రొత్త క్రొత్త వింతలను గనుగొనదలచిన వారికి హైదరాబాదు నందలి తెలుగుభాగమొక బంగారము వంటిది" అని శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు ప్రవచించి యున్నారు. శ్రీ వారి యాదర్శానుసారము ౧౯౨౨ నుండి ఇచ్చట చరిత్రపరిశోధనకార్యము ప్రారంభము చేయుటయు, అది "లక్ష్మణరాయ పరిశోధక మండలి" అను నామముతో మంచి కృషి చేసి యుండుటయు, ఏతన్మండలికి నేను ప్రారంభమునుండి కార్యదర్శిగా నుండుటయు అందరెరింగిన విషయమే.

ఆంధ్రవాఙ్మయము తరువాత ఆంధ్రచరిత్ర నాకు అభిమానవిషయము అగుటచే, నేను సంపాదకీయ భారము వహించిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవసంబంధమున ప్రకటితములయిన రెండు సంపుటములందును ఇచ్చటి చరిత్ర మహత్తును వీలయినంత వరకు ప్రదర్శించి యున్నాను. ఇట్లు నేను సాగించుచు వచ్చిన నా ఆంధ్రచరిత్ర కృషిని హర్షించి హైదరాబాదు రేడియో నిలయము తెలుగుశాఖాధిపతులగు మన్మిత్రులు శ్రీ భాస్కరభొట్ల కృష్ణరావుగారు

మంచి సంకల్పము చేసినారు. శ్రీకృష్ణరావుగారి ప్రోత్సాహము, ఒత్తిడివలన హైదరాబాదు రేడియోలో సుమారు ౪౦ ప్రసంగ ములు చేసినాను. ఇవిఅన్ని యుపత్రికలలో ప్రకటితములయినవి.

నా యీ చరిత్ర ప్రసంగములను పుస్తక రూపమున ప్రకటించవలసినదిగా మిత్రులు నిర్బంధించసాగిరి. వానిని అచ్చు వేయించు శక్తిలేకను, వేరు కారణములవలనను సంకోచించు చుంటిని. ఈ ప్రసంగములలో కొన్నింటిని ఇట్లు గ్రంథ రూప మున నిప్పుడు ప్రకటించుట ఆంధ్రపితామహ, మాడపాటి హను మంతరావుగారి నిర్బంధమే ముఖ్యకారణము.

ఈ గ్రంథమునందలి అలంపురము, ఆనగొంది, కల్యాణి, కొండాపురము, కొలనుపాక, గోలకొండ, ప్రతిష్ఠానము, భోనగిరి, రాచకొండ, వేల్పుగొండ కథనములు పదియు నా రేడియో ప్రసంగములు చిఱుతుక మార్పులతో ఇందు చేర్చినాను. పానగల్లు కథనము గోలకొండ పత్రికకు ప్రత్యేక ముగా వ్రాసిన వ్యాసము. ప్రాచీనాంధ్రనగర వర్ణనములలో ఓరుగల్లు వర్ణన లేకపోయినయెట్లు ? గ్రంథమునకు లోపముగా నుండగలదు" అని ఓరుగల్లునగరవర్ణన వ్రాయవలసినదిగా ఆంధ్రపితామహులవారు ఆజ్ఞాపించిరి. కావున ఆ భాగము ఈ గ్రంథముకొరకు ప్రత్యేకముగా వ్రాసియున్నాను.

నాకుగల పాండిత్యమల్పమగుటచేతను, మార్గదర్శ కులు మృగ్యమగుటచేతను, నా యోపిక కొలది బహుగ్రంథా

వలోకనముచేసి, నేను తెలిసికొన్న యంశములను తెలియని సోదరాంధ్రుల యెదుట పెట్టుటయే నా విధియని తలంచి ఈ చిన్న గ్రంథమును ప్రకటించుటకు సాహసించినాను. ఇదియొక మహాత్కార్యము కాకపోవచ్చును. కాని ఇట్టి రచనా విధాన ముగల గ్రంథము తెలుగు భాషలో లేనందున ఇట్టి గ్రంథము నకు అవసరము కలదని నామనవి.

నా ఆంధ్ర చరిత్రకృషికి మంచి దోహద మిచ్చినవారు హైదరాబాదు రేడియో నిలయమువారు, శ్రీ భాస్కరభొట్ల కృష్ణరావుగారు. వాటిని ప్రకటించి నన్ను సంభావించినవారు గోలకొండ, తెలంగాణ, మీజాన్, పత్రికాధిపతులు. వీరలకు నా ధన్యవాదములు సమర్పించుకొను చున్నాను. ఈ గ్రంథ మునకు విషయములను సేకరించుటలో Descriptive sketches of His Highness The Nizam's Dominions, Imperial Gazetteer, చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర, లక్ష్మ ణరావుగారి మహమ్మదీయ మహాయుగము, హైదరాబాదు ఆర్క శాఖవారి నివేదికలు, పత్రికలు, రచనలు, హైదరాబాదు సమాచారము, లక్ష్మణరాయ వ్యాసావళి, గోలకొండ, శారద, సుజాత పత్రికలు, ధంసాచరిత్ర, భోనగిరినిగూర్చిన ఉద్దుపుస్త కము, ప్రతాపరుద్ర చరిత్రము, శ్రీకృష్ణదేవరాయాంధ్రరజ తోత్సవ సంచిక, మాడపాటి హనుమంతరాయ షష్టిపూర్తి సంచిక, శ్రీశేషాద్రిరమణ కవుల రచనలు తోడ్పడినవి. కావున ఈ పండితులకు నేనెంతయు కృతజ్ఞుడనై యున్నాను.

ఇచ్చట ఆంధ్రోద్యమమునకును, శ్రీలక్ష్మణరాయ పరిశోధక మండలికిని స్థాపకులును, పట్టుగొమ్మలును అగు శ్రీ రాజానాయని వేంకటరంగారావు బహద్దరువారు నాయం డలి కరుణచే అంగీకరించినందున ఈ గ్రంథమును శ్రీరాజా గారికి సమర్పించుకొనుచున్నాను.

ఆంధ్రచంద్రికా గ్రంథమాలవారును, ముఖ్యముగా గ్రంథమాలస్థాపకులగు శ్రీ మాడపాటి హనుమంతరావు గారును దీనిని ప్రకటించి నన్ను గౌరవించినందుకు వారలకు నా ధన్యవాదములు.

| | |
|---|---|
| ౧౫—౨—౧౯౧౦<br>హైదరాబాదు | విధేయుడు<br>ఆదిరాజు, వీరభద్రరావు |



# విషయసూచిక



# పటముల సూచిక



# ప్రాచీనాంధ్రనగరములు.

" అది మేలైనపురంబు పూజ్యచరితుం

డారాజు రాణ్మండలం

బది పార్శ్వంబున నావిదగ్ధ సభవా

రబ్జాస్యల త్యుద్ధతం

బది రాజన్యక ముద్ది వందినికరం

బా గాథలున్ సర్వమున్

గదలంజేసిన కాల మూర్తికి నమ

స్కారంబు సత్కీర్తికిన్ "

భర్తృహరి.

౧.

# అలంపుర కథనము.

ఆంధ్రదేశములో చారిత్రికముగను, మత విషయకముగను ప్రఖ్యాతి కెక్కి వైభవసంపన్నమయి వెలసిన పురవరములలో అలంపురము గణనీయ మయినట్టిది. ఇది రాయచూరుజిల్లాలో నున్నది. తుంగభద్రానదీతీరమున నెలకొనియుండి ప్రకృతిరామణీయకమయి తనరారుచు, సమస్త సౌకర్యములతో నొప్పుచున్నది.

ఈ పుర మెప్పుడు నిర్మితమయినదో సరియైన చరిత్రాంశములు తెలియుటలేదు. అయినను ఇది అత్యంత ప్రాచీనమయినదని చెప్పవచ్చును. శ్రీశైలమునకు అలంపురము పశ్చిమద్వారమని ప్రసిద్ధికలదు. కావున శ్రీశైల క్షేత్రముతో సమానమయిన వయఃకాలము గలిగినదని యూహ్యమగుచున్నది. రెండు మూడు వేల సంవత్సరములకు పూర్వమే ఇది నిర్మితమయి యుండవచ్చును.

అలంపురములో "జోగులాంబ" నామాంకిత దేవాలయము ఇప్పటికిని గలదు. ఈ జోగులాంబను అత్యంత పురాతన కాలములో "యల్లమ్మ పురము" అని పిలుచుచుండిరనియు, "యల్లమ్మపుర"మను పదమే క్రమముగా మార్పులు చెంది అలంపురమయినదనియు వాదముకలదు. మరియొక ప్రవాదము నుబట్టి చూడగా, ఈ పురము అతి విస్తారముగా పెరుగుచు పోవుచున్నందున ఒకానొక మునీశ్వరుడు "అలంపురీ" అన్నా

డట! అలంపురీ అనగా, "పురమా! ఇకవద్దు" అనగా ప్రవృద్ధి వద్దు అని భావము. అంతటితో పురవిస్తరణ మాగిపోయినదని చెప్పుచుందురు. శాసన లేఖనములలో దీనికి "హాతంపుర"మను నామముండినట్లు తెలియుచున్నది. "హతంపుర ప్రతీతమహా [illegible]హాతి" అని వ్రాయబడియున్నది. బ్రహ్మేశ్వరుని నిలయమగుటచే [illegible] దీనికి బ్రహ్మపురి అనియు నామాంతరమున్నట్లు శాసనములవల్ల తెలియుచున్నది. విద్యాపీఠమగుటచే విద్యాపురి అనియు ఇక [illegible] నాచినచో [illegible] ము [illegible] న ము [illegible] డినటు [illegible] బడెను. ఉవ్వరు నిలిచి, ప్రసిద్ధికెక్కి, ఇప్పుడు ప్రచారములో నున్న నామము "అలంపురము."

ఈ నగర మిప్పుడు శిథిలమయి చాలవరకు తొంటికళను గోల్పోయి కనబడుచుండును. ఈ పురమిప్పుడు రాజకీయముగ ప్రముఖ్యత లేకపోయినను మత విషయముగ ని[illegible] ప్రఖ్యాతులను గలిగియున్నది.

అత్యంత పురాతన కాలములో ఈ పురమునకు దేవుడే రాజుగానుండెనట! చారిత్రకముగ నిజము విచారించినచో శాసనములను బట్టి ఇది కల్యాణి పశ్చిమచాళుక్యుల పరిపాలన లోనున్నట్లు తెలియుచున్నది. చాళుక్య చక్రవర్తుల సామంతులు అలంపురమును రాజధానిగా చేసికొని పరిపాలించుచుండిరి. ఈ సామంతరాజులు ఆంధ్ర చోడులుగా నున్నారు. చాళుక్య చక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుని రాజ్యారంభ కాలమగు క్రీస్తు

శకము ౧౦౭౬ నుండి చారిత్రకాంశములు కొంతకొంత వరకు తెలియుచున్నవి. త్రిభువనమల్లుడు, త్రైలోక్యమల్లుడు, భువనైకమల్లుడు, మున్నగు చాళుక్య చక్రవర్తులతో అలంపురమునకు సంబంధముగలదు. మహాస్థానాధిపతి ధరణీంద్రరాశి పండితుడు, మహాస్థానాధిపతి సోమేశ్వరరాజభట్టారకుడు, మహామండలేశ్వర మల్ల మహారాజు. మహామండలేశ్వర నిరుగలిచోళమహారాజు. బద్దెన చోడమహారాజు, శ్రీమద్వెడ్డనాథుల దండనాయకుడు, మహామండలేశ్వర అశ్వ బరగండ హేంమాదిదేవ మహారాజు మున్నగువారు పాలకులుగానుండిరి. తరువాత కాకతీయులు, రెడ్లు ఈ పురమునకు పాలకులుగానున్నట్లు తోచుచున్నది. ౧౬ వ శతాబ్దములో బిజ్జల తిమ్మభూపాలుడు అలంపురి రాజుగానుండెను. ఈ రాజన్యుడు సంస్కృతములో మురారికవి రచించిన అనర్ఘరాఘవ నాటకమును పద్య ప్రబంధముగా విరచించి, ఆంధ్రవాఙ్మయ చరిత్రలో గణుతికెక్కియున్నాడు. ఇతడు పనపర్తి సంస్థానాధీశ్వరుండగు అష్టభాషాగోపాలరాయని మేనల్లుడు ఈ పురమునుగూర్చి చరిత్ర పరిశోధన ఇంక నెంతో చేయవలసియున్నది. పరిశోధనాంశములు బయటపడిన కొలది ఈ పురముయొక్క ప్రాచీనత, ఔన్నత్యము, వైభవము, సౌందర్యము వెల్లడి కాగలదు.

చారిత్రకాంశములు మనకెక్కువగా తెలియకపోయినను, ఈ పురముయొక్క ఘనతను చాటుటకు శిథిలావస్థలోనున్నను, ఇంకను హృదయము నాకర్షించుచు మనలను విభ్రాంతులను చేయగలుగు చరిత్ర చిహ్నములు పెక్కుగలవు వైభ

వదశలో ఈ పురము ఎట్లుండెనో ఊహించవలసినదేగాని వర్ణించుట కలవిగాదు.

ఇప్పుడు కనబడు చిహ్నములన్నియు మతవిషయకమైనట్టివి. ఈ పురము పురాణ ప్రసిద్ధిగల గొప్ప శైవక్షేత్రము. ఇచ్చట సుమారొక చదరపుమైలు వైశాల్యముగల కోటగలదు. ఈ కోటలో పెక్కు దేవాలయములు గలవు. ఇచ్చటి శివునకు బ్రహ్మేశ్వరుడను నామముగలదు. ఇట్టి నామముగల శివాలయములు మరెచ్చటను అంతగా కనబడవు. ఈ కోటలో తుంగభద్రకు సమీపముగా ఉత్తరదక్షిణపు వరుసగా బాల, కుమార వీర, విశ్వ, తారక, గరుడ, అర్క, స్వర్గ, పద్మ బ్రహ్మేశ్వరులనబడు నవబ్రహ్మేశ్వరుల యాలయము లొక్కరీతి శిల్పముతో నొప్పుచున్నవి. ఈ దేవాయతనముల శిల్ప చాతుర్యము అచ్చెరువు గొలుపుచుండును. కొంచెమేని సున్నము నుపయోగించక రాళ్లనుమలిచి, తొలిచి, ఈ ఆలయములను గట్టియుండిరి. వీటిపయి శిల్ప విన్యాసము గులుకుచుండెడి లతలు, పుష్పములు, విగ్రహములు, కన్నుల పండువుగా చెక్క బడినవి. పవితనపు అందమును దుండగులు చెడగొట్టినారు. దేవాలయ శిఖరములు పరమిడులవలె చతురాకారముగా వెలసి, ఘనమైన వేరువిధ శిల్పచాతుర్యముగల శిఖరములతో పరివృతమయి యొప్పుచుండును.

నవబ్రహ్మేశ్వరులలో బాలబ్రహ్మేశ్వరుడు మాత్రము కళావంతుడయి యాత్రికులకు దర్శనయోగ్యుడుగా నున్నాడు.

ఈ లింగము శిలగాదు. లక్క, రుద్రాక్ష మొదలయినవానితో కప్పబడి యున్నట్లు తోచుచున్నది. మఱియు స్థలపురాణములో జ్యోతిర్లింగమని విఖ్యాతిచెందియున్నది. ఇంకొక విచిత్ర విశేష మేమనగా, ఎన్ని వేల కడవలతో అభిషేకము చేసినను ఒక చుక్కయయినను బయటికిరాదు. ఎక్కడికి పోవునో తెలియదు. బాలబ్రహ్మేశ్వరుడు ఈ క్షేత్రపు ప్రధాన దైవము. ఈ దేవాలయ సింహద్వారము ముందటి సోపానముల మీదనుండియే తుంగభద్రా నది ప్రవహించుచు, బాలబ్రహ్మేశ్వరులకు పాదాభివందన మొనర్చుచుండినట్లుండును.

స్థల పురాణమును బట్టియు, ప్రజాప్రవాదమును బట్టియు ఈ క్షేత్రము కాశితో సమానమయినదని ప్రశస్తి కలదు. కాశిలో వలెనే ఇచ్చటను మణికర్ణికాఘట్టము, పాపనాశన ఘట్టము, హరిశ్చంద్ర ఘట్టము, మున్నగు అరువదినాలుగు ఘట్టములు కలవు. ఇచ్చట కోటిలింగములున్నవట ! ఇప్పటికిని లెక్క తేలలేదు. దేవాలయములు పెద్దవి, చిన్నవి ౧౦౦ కి పైగానున్నవి. కాశిలో మరణము దుర్లభమని చెప్పెదరు. అయితే, ఇచ్చట నివాసము దుర్లభమట! హంతపురమను నామమునుబట్టి యీపురము శాపగ్రస్తమయి యుండనోపును. అందుచేత నివాసమునకు దుర్లభమైనదేమో ! శివభక్తు లెచ్చ టెచ్చటనుండియో యిప్పటికిని వచ్చి దేవుని సేవించుకొని పోవుచుందురు.

అలంపురములోని దేవాలయములలో జోగులాంబ ఆల

యము పేర్కొనదగినది. ఈ దేవతనే ప్రాచీనకాలములో "యల్లమ్మ" అనుచుండిరట! ఈమె ఆదిశక్తి. శ్రీ ఆది శంకరులవారు పేర్కొనిన అష్టాదశ శక్తిపీఠములలో నిది యొక్కటి యయియున్నది. కంచికామాక్షి, మధుర మీనాక్షి, కాశీవిశాలాక్షి మొదలగు శక్తి స్వరూపిణులతో సమానమైనట్టిదీ జోగులాంబ. ఈ పరాశక్తి విగ్రహము భయంకరమైనట్టిది. ఈ క్షేత్రమున ఈ జోగులాంబ ప్రభావమును విశేషముగ దెలుపుచున్నారు.

నగ్నత్వమున, శిరోవిహీనముగ రేణుకాదేవి విగ్రహము కలదు. అసభ్యత్వమున నొప్పు నీవిగ్రహముండుట సుప్రసిద్ధ శైవ క్షేత్ర సంప్రదాయమని తెలియుచున్నది.

ఈ ఆలయముల నొకరసిద్ధుడు గట్టించెననియు, శిల్పులకు, పనివాండ్రకు నొసగవలసిన భృతికి తుంగభద్రలోని యిసుకను ప్రోవుచేసుకొమ్మని, యాకుప్పలపయి పసరును పిండువాడనియు, అట్లుచేయగా నెవ్వరెవ్వరెంత శ్రమ యొనర్చిరో యందులకుం దగినట్లుగా కాంచనము లభించెడిదనియు చెప్పుచున్నారు. అతడీ తీరున నాలయములను గట్టించి ప్రతిష్ఠసలిపి, తన పేరితో నొక శిలావిగ్రహమును చేయించి యుంచినాడని యొక విగ్రహమును చూపించుచున్నారు. ప్రదక్షిణ మొనర్చుటకు అనువయిన యాలయ అంతర్భాగమున గర్భాలయపు గోడలో రసిద్ధ నాయకుడని పిలువబడునొక గణపతివిగ్రహము కలదు. దీనిని ఆలయము గట్టించిన రసిద్ధుడీసుకతో పసరుల



జయసింహ వీరగల్లు-ఆలంపురము



నటరాజస్వామి ఆలంపురము

భలమున నిర్మించెనని తెలియుచున్నది. స్పృశించినమాత్రాన ఇసుకగా రాలు నీ విగ్రహము స్వయంవ్యక్తమని తోచు చేయు చున్నది.

గ్రామమునకు మధ్యభాగమున సూర్యనారాయణాలయము గలదు. ఆలయ పైభాగమున అష్టదిక్పతులు వాహనారూఢులయి యున్నటుల చిత్రింపబడియున్నది. ఆప్రక్కను దశావతారములు కూడ చిత్రింపబడియున్నవి. వాని క్రింద వృక్షముక్రింద— బుద్ధుడుకాబోలు— బోధించుచున్నటు లున్నది.

దక్షిణమువైపున నరసింహాలయముగలదు. ఇందలి యుత్సవ విగ్రహములును, నరసింహ విగ్రహము ను దివ్యసుందరములు. ఇచ్చటి కోటగోడలోనుండి నాల్గయిదు మోటల నీటి ప్రవాహ మొకటి తూర్పుగా తుంగభద్రలో పడుచున్నది. ఇది యెచ్చట పుట్టినదో గ్రహించుటకు వీలులేదు. నీరు టెంకాయ పాలను బోలి నిర్మలముగా నుండును.

కోటకు నుత్తరముగా మూడు నాలుగు మైళ్లవరకును తుంగభద్రయొడ్డున పెద్దగ్రామముగానుండి శిథిలమయిన చిహ్నములు గానవచ్చుచున్నవి. అందందు ఆలయపుటడుగు ప్రదేశములు, ఆలయ శల్యములు, నందులు, లింగములు, అనేకములు గానవచ్చుచున్నవి. విశేషము తుంగభద్ర ప్రవాహపు టిసుక క్రింద కప్పబడియున్నట్లును, త్రవ్వుటగల్గిననే లేనివిశేషములు బయల్పడగలిగి యున్నట్లును తోచుచున్నది.

బ్రహ్మేశ్వరాలయమునకు మైలుదూరమున దక్షిణముగా వివిధ విగ్రహములమధ్య రాక్షస ముఖముతో నొక విగ్రహము నిల్చియున్నది. దీనిని గుడిగింజ మాధవుడందురు. ఇతడొక చేత వరిముల్లును బట్టుకొని, కాలిక్రింద నొక అగ్నిగుండమును గలిగియున్నాడు. కాశీ క్షేత్రమునకంటె వరిముల్లంత తక్కువ ప్రభావముగలదీప్రదేశమను వారిని అగ్నిగుండమున పడద్రోసి త్రొక్కెదనని చూపించుచున్నాడట !

గ్రామ మధ్యమందును; బాలబ్రహ్మేశ్వరుని ఆలయమునను రెండు పెద్ద సాలంకాయనలింగములు ౯౯౮ లింగములతో నొప్పుచున్నవి. మహిషాసుర మర్దనీ ఆలయము, వేంకటేశ్వరాలయము, కామాక్షి ఆలయము, వీరభద్రస్వామి ఆలయము, మొదలగునవి కలవు. ఇప్పుడు బాలబ్రహ్మేశ్వరాలయము, సూర్యనారాయణాలయము, నరసింహస్వామి ఆలయము, వేంకటేశ్వరాలయము, జోగులాంబదేవి ఆలయము, వీరభద్రస్వామి ఆలయము అనునవి పూజాదులను గలిగియున్నవి. మహోత్సాహముతో సంవత్సరమునకొకసారి గొప్పగా వీటికి జాతరలు జరుగుచుండును.

కోటగోడకుపయోగించిన రాళ్లలో ననేకములు బౌద్ధ జైన చిహ్నములు గలిగియున్నవి. సూర్యనారాయణాలయ సమీపమున నొకరు వృక్షముక్రింద బోధించుచుండినట్లున్నది. ఆ బోధించుచుండునది బుద్ధదేవుడేమో. ఇట్టి చిహ్నములను బట్టి యిది అత్యంత పురాతన కాలమున బౌద్ధక్షేత్రముగనో,

జైన క్షేత్రముగనో కూడ యుండి యుండెనా ?

ఇచ్చట పెక్కు వీరగల్లులు కలవు. వీరగల్లులనగా వీరుల స్వరూపములు చెక్కిన శిలలు. వీటిపై కొన్ని అక్షరములు చెక్కబడి యున్నవి. ఈ వీరులు రణరంగమున వీరశయనము నొందినవారుగా నున్నారు. కొన్ని వీరగల్లులు గోడలలో పూడి పోయి యున్నవి సామాన్యముగ ప్రతి వీరగల్లునయి ఒక విలాస పురుషుడు స్త్రీద్వయముతో విమానములో పోవుచు న్నట్లు ఒక చిత్రముండును. యుద్ధమున మరణించిన వారికి వీర స్వర్గము లభించునని మన పురాణగాథలు నుడువుచుండును గదా ! అది సూచితము కాబోలు.

అలంపురములో పెక్కు శాసనములు కలవు. కాని అందు కొన్ని ఆలయపు గోడలలో నిరికించబడి యున్నవి. కొన్ని అరుగులుగా పరుపబడియున్నవి. కొన్ని జనసంచారపు త్రొక్కుడులలో నరిగిపోయినవి. కొన్ని తుంగభద్రానది ప్రవాహము వలన నేర్పడిన యిసుక మేట భూగతమయియుడం గియున్నవి. కొన్ని భిన్నములయియున్నవి. కొన్ని దట్టముగులు గా నున్నవు పూతలతో నఘోరించుచున్నవి. వీనిలో కొన్నిం టిపయి అత్యంత ప్రాచీన లిపి కనబడుచున్నది. వీటినన్నిటిని జాగ్రత్తగా పరిశోధించినచో అపూర్వము చరిత్రాంశములు బయలు పడగలవని నిస్సందేహముగ నుడువవచ్చును.

మన పూర్వుల ధర్మ చింతన విస్తారమునకును, విశ్వర ణశీల ప్రదర్శనమునకు, కళాసౌందర్య లాలసత్వమునకును, అలంపురక్షేత్రము ప్రబలదృష్టాంతముగా నున్నది.



# ఆనగొందికథనము.

ఆనగొందినగరము చిన్నదగు ఆంధ్ర సంస్థానమునకు రాజధానిగా తనరారుచు కొంత పేరు ప్రతిష్ఠలను కలిగియున్నది. ఆనగొంది సంస్థానము శ్రీ శ్రీ నిజాము ప్రభువు వారికి సామంత రాజ్యముగా నుండియుండెను. ఇప్పటి నూతన రాజకీయ వ్యవస్థ పరిణామముగా సంస్థాన ప్రత్యేకత్వమును గోల్పోయి హైదరాబాదు రాష్ట్రము లో విలీనమయిపోయినది. కాని పురాతన కాలమున స్వతంత్ర రాజ్యముగానుండి ఆంధ్ర చరిత్రయందు ప్రముఖపాత్రను వహించి యుండెను.

ఆనగొంది పురము తుంగభద్రానదికి ఉత్తర తీరమున నిర్మితమయి యుండెను. ఈ ఆనగొంది రాజన్యులే తుంగభద్రా నది దక్షిణతీరమున వెలసిన సుప్రసిద్ధ విజయనగర పట్టణనిర్మా ణమునకు కారకులయి యుండిరి. విజయనగరము ప్రాముఖ్య మునకు వచ్చి ప్రబలినకొలది ఆనగొంది ప్రాముఖ్యము తగ్గ సాగెను. సృష్టిక్రమమునననుసరించి విజయనగరము నాశన దేవత పాలుకాగా, తిరిగి ఆనగొంది రాజధాని నామగౌరవమునకు పాత్రమయ్యెను. ప్రస్తుతపు ఆనగొంది రాజన్యులు విజయనగర రాజ వంశీయులే యయి యున్నారు.

ఆనగొంది యనగా ఏనుగులకోనయని యర్థము. దీనిని బట్టి ఆ ప్రాంతము నిబిడారణ్యమనియు, ఏనుగులెక్కువగా నుండు ప్రాంతమనియు తేలుచున్నది. ఈఅరణ్యమును కొట్టించి, ఆ పావన తుంగభద్రానదీ తీరమున పట్టణము కట్టించి, రాజ్య స్థాపనము గావించిన మహనీయుడెవ్వడో సరియైన చరిత్రాంశములు కానరావు. రామాయణములో వర్ణితమయిన కిష్కింధాపురమిదియేయనియు, శ్రీరామచంద్రుడు సుగ్రీవునితో మైత్రి చేసికొని వానరులను సీతాదేవి యన్వేషణార్థము నలుదిక్కులకు పంపినదిక్కడనుండియే యనియు, హనుమంతుడు సీతాసందేశమును గొనివచ్చి శ్రీరామునకు వినిపించినదిచ్చటనే యనియు, ఋష్యమూక పర్వతమిచ్చటనే యున్నదనియు చరిత్రకారులు భావించుచున్నారు.

చరిత్రలో ఆనగొంది పేరు యవనుల దాడితో పరిచితమగుచున్నది. యవనులనే వారు ఆశియా గ్రీకులు. ఈ యవనులు క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దప్రారంభమున ఓఢ్ర దేశములో ప్రవేశించిరి. క్రీస్తు శకము అయిదవ శతాబ్దములో వారచ్చటనుండి తరుమబడిరి. వారట్లు రాజ్య విహీనులయి బయలుదేరి మధ్యపరగణాలనుజయించి, అచ్చటనుండి దక్షిణమునకు తరలి క్రీస్తుశకము ౫౧౫ ప్రాంతమున ఓరుగల్లులోని ఆంధ్ర రాజును జయించిరట ! ఈ యవనరాజులు ౪౫౮ సంవత్సరములు రాజ్యము చేసిరట ! వీరు క్రీ. శ ౭౮౦ ప్రాంతమున రాజ్య విస్తరణము గావించుచు కొంత సముద్రతీర ప్రాంత ప్రదేశాలను సంపాదింపగలిగిరి. ఈ ప్రాంతమునకు ఆనగొంది

రాజధానిగా నుండెను. క్రీస్తు శకము పదియవ శతాబ్దములో యవనులు తమరాజ్యాలను గోలుపోయిరి. అంతటితో ఈ గ్రీకు యవనులందరు బౌద్ధమతావలంబులయి యవన నామమును గూడ గోల్పోయిరి. ఆనగొందిలో దేశీయ రాజులు ఏడువందల సంవత్సరములవరకు రాజ్యము చేసియుండిరి. విశేషములేమియు తెలియవచ్చుటలేదు.

నందుడను రాజు క్రీ. శ ౧౦౧౪ లో ఆనగొందిలో రాజ్యము చేయసాగెను. ఇతడు నలుబది మూడు సంవత్సరములును, పిమ్మట ఇతని కొడుకు చాళుక్యరాజు ౪౦ సంవత్సరములును ఆనగొందినేలిరి. (౧౦౭౬-౧౧౧౭). చాళుక్యరాజు మొదటి కుమారుడు బిజ్జలుడే కల్యాణపురమునకు రాజయ్యెను. రెండవ కొడుకగు విజయధ్వజుడు ఆనగొందికి రాజయ్యెను. ఈ విజయధ్వజుడు ౩౯ సంవత్సరములు ఆనగొందినేలెను, (౧౧౧౭-౧౧౫౬). విజయధ్వజుని తరువాత ఆతని పుత్రి, పౌత్రి క్రమముగా అనుమరాజు, రామదేవరాయలు, ప్రతాపరాయలు కాలక్రమాను సారముగా రాజ్యమునేలిరి. ప్రతాపరాయల కుమారుడు జంబుకేశ్వరుడు ౧౨౯౭ లో సింహాసనమెక్కి ౩౭ సంవత్సరములు మహా దక్షతతో, జనరంజకముగ ఆనగొంది రాజ్యమేలి ౧౩౩౪ లో మరణించెను. ఆనగొందినేలిన పూర్వ రాజ పరంపరలో నీతడే కడపటివాడు.

జంబుకేశ్వరుడు పౌరుషశాలి యగుటచే, అప్పుడు ఢిల్లీ నేలుచుండిన మహమ్మదు తుఘ్లకును ధిక్కరించి వర్తించుచుం

డెను. జంబుకేశ్వరుని స్వాతంత్ర్య నిరతిని మహమ్మదు తుఘ్లు
కు సహింపజాలక ఆనగొంది పయి దాడిసలుప సైన్యమును పం
పించెను. పండ్రెండు సంవత్సరములు యుద్ధము జరిగెను. అయి
నను జంబుకేశ్వరుడు ఢిల్లీశ్వరునకు లోబడడయ్యెను. ఇం
తలో ఢిల్లీశ్వరుని మేనల్లుడొక ఘోరాపరాధముచేసి, మహ
మ్మదు తుఘ్లుకుకోపానలమున పడి మగ్గకుండ తప్పించుకొని
పోయి జంబుకేశ్వరుని శరణుజొచ్చెను. జంబుకేశ్వరుడు వాని
కభయహస్తమిచ్చెను. జంబుకేశ్వరునిపయి యిదివరకే క్రుద్ధుడై
యుద్ధము సలుపుచుండిన ఢిల్లీ సుల్తాను ఈ మేనల్లుని కారణ
మున మరింత ఆగ్రహావేశుడయి ప్రచండ సైన్యమును కూర్చు
కొని స్వయముగ నేతెంచి, యుద్ధసంరంభమును నడుపసాగెను.
కాని జంబుకేశ్వరుని జయించుట కష్టమనియే అతడు తలంచెను.
అంత నామేనల్లుని నాకప్పగించితివా యుద్ధముమాని వెడలి
పోయెదనని సుల్తాను రాయబారములు ప్రారంభించెను. శరణా
గత త్రాణ బిరుదాంకితుడగు జంబుకేశ్వరుడు వాని రాయబా
రములను త్రోసివేసి యుద్ధము చేయసాగెను. ప్రచండ సేనా
బలముగల మొగలు చక్రవర్తితో పోరుట దుర్ఘటమయిపో
యెను. అపజయము నిక్కమని తెలియగనే తురుష్కుల చేతబడ
కుండ, తన భార్యా పుత్రాదులను తనచేతిమీదుగా నఱికి, ఆ
ఖడ్గ సహాయుడయి రణరంగమునకుఱికి ఘోరముగా బోరి జం
బుకేశ్వరుడు వీరశయనము నొందెను. విజయుడయి మహమ్మ
దుతుఘ్లుకు ఆనగొందిని సర్వనాశనమును చేసి ఆరుగురిని ఖయిదీ
లుగా ఢిల్లీకి తీసికొని పోయెను. ఈ ఆరుగురిలో ఆనగొంది
రాజ్య మంత్రి యొకడు, కోశాధ్యక్షుడు రెండవవాడు, మిగత

నలుగురు గొప్ప సరదారులు. మంత్రి పేరు హరిహర రాజులు. కోశాధ్యక్షుని పేరు బుక్క రాయలు.

హరిహరరాయలు, బుక్కరాయలు అనువారిద్దరు సోదరులు. ఓరుగల్లు కాకతీయ చక్రవర్తి యొద్ద గొప్ప ఉద్యోగములలో నుండిరి. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఈ సోదరులిద్దరు తమ అదృష్టమును వెతుకుకొనుచు ఆనగొంది చేరిరి. ఆనగొందిరాజు వారి తెలివి తేటలను, సాహస పరాక్రమములను గని ముగ్ధుడయి వారిద్దరిని తన కొలువులో చేర్చుకొని రాజ్య పరిపాలనా భారము వారిపయి వదలెను.

మహమ్మదు తుఘ్లకు ఆనగొందిలో మలిక్ నాయబు అను వానిని పాలకునిగా నియమించి ఢిల్లీకి వెడలిపోయెను.

ఆనగొంది రాజ్యప్రజలు జంబుకేశ్వరునియెడ భక్తిభావములు కలిగి వానిని దేవునివలె గౌరవించుచుండిరి. తమ ప్రభువట్లు నాశనముకాగా ప్రతీకార భావముతో మలిక్ నాయబు పయి తిరుగబడిరి. పారతంత్ర్యమును సహించలేకుండనున్న యా ప్రజల యలజడి మలిక్ నాయబును గడగడలాడించెను. తాను పెద్ద సంకటములో నున్నట్లు ఢిల్లీకి విన్నపములు పంపుకొనెను. ఢిల్లీశ్వరుడు మిక్కిలి నష్టపడి యుండుటచేతను, అలసి యుండుట చేతను తిరిగి యుద్ధ ప్రస్థానమునకు జంకి తనయొద్ద చెరలో నున్న యార్గురికి చెరవదిలించి, ఆనగొంది రాజునకు అమాత్యశేఖరుడుగానున్న హరిహరరాయలకు ఆనగొంది రాజ్యాధిపత్యము నొసంగి, తనకు సామంతుడుగా నుండునట్లు ఒడబరి

చెను. బుక్కరాయలను ఆనగొంది రాజ్యమునకు మంత్రిగా నియమించెను.

హరిహరరాయలు, బుక్కరాయలు అను సోదరులిద్దరు ఈ విధముగా ఆనగొంది రాజ్యమునకు రాజును, మంత్రియు వరుసగా నయిరి. ఈ సోదరులే శ్రీ మాధవ విద్యారణ్యస్వాములవారి తపోబల సహాయముతో క్రీ. శ ౧౩౩౬ లో విజయనగర నిర్మాతలయి, విజయనగర సామ్రాజ్యమునకు మూలపురుషులయి వన్నెకెక్కిరి విజయనగర సామ్రాజ్యము ౧౫౬౫ లో తాళికోట యుద్ధమున సర్వనాశనము కాగానే, విజయనగరమును ముసల్మానులు కొల్లగొట్టుటయేగాక ఆనగొందిని కూడ కొల్లగొట్టి ధ్వంసము చేసిరి. అప్పుడు విజయనగర రాజవంశీయుడగు రామరాయల తమ్ములు తిరుమల రాయలు పెనుగొండలోను, వేంకటాద్రిరాయలు చంద్రగిరిలోను రాజ్యములను స్థాపించుకొని యేలసాగిరి. చంద్రగిరినేలుచుండిన, శ్రీరంగరాయలవారే క్రీ. శ. ౧౬౩౯ లో ఈస్టిండియా కంపెనీవారికి మద్రాసు ప్రాంతమును ఇచ్చియుండిరి. క్రీ. శ. ౧౬౫౩ లో చంద్రగిరిని గోలకొండ నవాబులు జయించిరి. అప్పుడు ఈ రాజవంశమునకు ఆనగొంది యొక్కటియే మిగిలిపోయెను. ౧౬౮౭ లో గోలకొండ మొగలుల స్వాధీనమయిన తరువాత ఆనగొంది మొగలుల సామంతరాజ్యమాయెను. ౧౭౭౬ లో టిప్పుసుల్తాను ఆనగొంది నాక్రమించి అప్పుడు రాజ్యముచేయుచున్న తిమ్మప్పరాజును సింహాసన భ్రష్టునిగావించెను. అంతటితో నాగక మందిరములను కూలద్రోసి, పట్టణమును దగ్ధము

చేసెను. ఇట్టి దారుణ కార్యముల మూలకముగా విజయనగర రాజవంశమునకు సంబంధించిన అమూల్య లేఖనములును నశించి పోయెను. టిప్పూసుల్తాను యుద్ధమునందోడి మరణించి నతరువాత బ్రిటిషు ప్రభుత్వమువారు ఆనగొంది రాజవంశీయుని గద్దెపైనెక్కించి, ఆ రాజునకు రు ౧౩౦౦-౦-౦ లు మాసికభృతి ప్రసాదించిరి. ఇప్పుడు శ్రీ రాజా శ్రీకృష్ణదేవరాయలవారు ప్రకాశమానులుగా నున్నారు. వీరు విజయనగర సామ్రాజ్య కడపటి చక్రవర్తియగు రామరాయల వంశజులయియున్నారు.

ఆనగొంది నగరమును పదునారవ శతాబ్దప్రారంభములో నరసింగ రాయలవారు పాలించుచుండిరి. నరసింగరాయలవారు పట్టణమునకు ప్రాకారకుడ్యములు నిర్మించి దుర్గమును బలిష్ఠమొనరించిరి. వాయవ్య దిశనుండు కోటగోడ ఒక మైలు పొడవుండును. ఈ కోట గోడల నొరసికొనియే తుంగభద్రానది ప్రవహించుచుండును. అయితే ఈ కోటగోడలిప్పుడు శిథిలావస్థలో నున్నవి.



౩.

# కల్యాణి కథనము.

దక్షిణాపథము నేలిన రాజులలో చాళుక్యులు సుప్రసిద్ధులు. ఈ వంశీయులు రాజ్యమును పంచుకొనిరి. తూర్పున వేంగీ రాజధానిగా నేలిన వారు తూర్పు చాళుక్యులయిరి. పశ్చిమమున కల్యాణి రాజధానిగా నేలినవారు పశ్చిమ చాళుక్యులయిరి. పశ్చిమ చాళుక్యరాజగు రెండవ పులకేశియు, తూర్పు చాళుక్యరాజులలో మొదటివాడయి ఆంధ్రుడని ప్రఖ్యాతికెక్కిన కుబ్జ విష్ణువర్ధనుడును అన్నదమ్ములగుటచే పశ్చిమ చాళుక్యులు ఆంధ్ర కూటమిలో చేరినవారేయని చెప్పవలయును. పశ్చిమ చాళుక్యులను మహారాష్ట్రులనియు, కర్ణాటకులనియు అభిమానములను పురస్కరించుకొని వేర్వేరు విధముగా చరిత్రకారులు వ్రాసినారు. కాని ఇవి తరువాత పెట్టిన పేర్లు. చాళుక్యులును శాతవాహనుల వలెనే ఆంధ్రులు.

చాళుక్యులు సమిష్టి కుటుంబముగా నున్నప్పుడు వాతాపి (బాదామి) నగరము వారికి రాజధానిగా నుండెను వాతాపి నగరములో నిలచిపోయిన పశ్చిమ చాళుక్యులు కల్యాణి నగరమును క్రీ. శ. ౯౭౦ లో రాజధానిగా చేసికొనిరి. ఈ కల్యాణి-గరము గుల్బర్గా జిల్లాలో నున్నది. దీనికి కటకమనియు,

కల్యాణి కటకమనియు నామాంతరములుండెను.

చాళుక్యులు రాజధానిగా చేసికొనకముందే కల్యాణి యొక ప్రముఖనగరముగా నున్నట్లు తోచుచున్నది. కల్యాణి కటకాధీశుడగు బల్లహుడను వాడు నందగిరి యని పిలువబడు చుండిన నాందేడు రాజగు సోమదేవరాజును యుద్ధములో జం పెను. సోమదేవరాజు భార్యయగు రాణీసిరియాలదేవి అప్పుడు గర్భవతిగానుండెను. ఈ సిరియాలదేవి శతృబారి పడకుండ హనుమకొండలోని మాధవశర్మ అను బ్రాహ్మణోత్తముడు శర ణమిచ్చి రక్షించెను. ఈ రాణి కుమారుడే మాధవవర్మ. ఇతడు కాకతీయ వంశమునకు మూల పురుషుడయి విఖ్యాతి చెందెను. ఇది క్రీ. శ. నాల్గవ శతాబ్దములో జరిగిన కథ.

క్రీస్తుశకము ఆరవ శతాబ్దములో చాళుక్యరాజగు పుల కేశి యనువాడు చోళరాజధానియగు కాంచీపురమును ధ్వం సము చేసినవాడట. దానికి బదులుగా చోళరాజు కళ్యాణిని నాశనము చేసినట్లు ఒక శాసనము వల్ల తెలియుచున్నది. తరు వాత నీపట్టణము ఎట్లో కోలుకొని ప్రసిద్ధికి వచ్చి సకల సంప ద్వైభవములతో తులదూగుచుండగా, పదియవ శతాబ్దములో రాష్ట్రకూట రాజగు రెండవ అకాలవర్షుడు కల్యాణిని స్వాధీ నము చేసికొనుటకు ప్రయత్నించినట్లు కనబడుచున్నది.

చాళుక్యరాజగు తైలపదేవుడను మూడవ విక్రమాది త్యుని కాలములో అనగా క్రీ. శ. ౯౭౦ ప్రాంతములో కల్యా

ణినగరము రాజధాని నామ గౌరవమును పొందెను. ఈ వంశములో అయిదవ వాడగు సోమేశ్వరుడు పదునొకండవ శతాబ్దములో కల్యాణిని ప్రపంచములోని పట్టణములకు అందచందములందును, వైభవము నందును మేలిబంతిగా నొనర్చెను. అంత ఇతర రాజులకును దానిపయి మోహము కలుగసాగెను.

క్రీ. శ, ౧౧౫౦ లో రెండవ తైలపదేవుడు చాళుక్య సింహాసనమునకు వచ్చెను. అప్పుడు కాలచుర్యరాజగు బిజ్జలుడు తైలపదేవుని యోడించి కల్యాణిని స్వాధీనము చేసికొనెను. కాలచుర్యవంశపతనానంతరము హొయిసలులు, యాదవులును కల్యాణితోపాటు చాళుక్యరాజ్యమును వరుసగా పాలించిరి.

పదునాల్గవ శతాబ్దములో గుల్బర్గా యందు బహమనీ రాజ్యము స్థాపితమయినప్పుడు కల్యాణి ఆ రాజవంశము వారి వశమయ్యెను. తరువాత నది విజాపుర నవాబుల స్వాధీనములోనుండగా, అహమదు నగరు నవాబు హుస్సేన్ నిజాంశాహ ఆక్రమించెను. ఈతనిపై విజయనగర రాజగు రామరాయలు దాడి సలిపి ఘోరముగా పోరి కల్యాణి పట్టణమును స్వాధీనము చేసికొనెను. రామరాయల కల్యాణి దండయాత్ర విషయమును—

"విశ్వామిత్రునిఁ గొల్చి రాముఁడతఁ
డుర్విం జెందెఁ గల్యాణముఁ
విశ్వామిత్రులు గొల్వ రాముఁడితఁ

దుర్గం జెందె గల్యాణముణ
శశ్వత్కీర్తులు రాములయ్యిరువురుణ
సాధించు కల్యాణలా
భైశ్వర్యంబులు ధర్మ నిర్మథన ధ
ర్మాలంబన వ్యక్తముణ."

అని రామరాజభూషణకవి రామాయణ కథాంశము తో పోల్చి చక్కని శ్లేషలో వసుచరిత్రియందు చమత్కరించినాడు.

అప్పటి లిఖితములను బట్టి చూచినను బిజాపూరు రాజ్యములో కల్యాణి అత్యంత సంపద్వృద్ధి గలిగి శోభావంతముగా నుండెను. ౧౬౩౫ లో దీనిపయి మొగలులు దాడి సలిపి, పుర జనులను వధించి పట్టణమును భీభత్సము చేసిరి. అంతటితో నాగక ౧౬౫౬ లో ఔరంగజేబు స్వయముగా సేనను నడుపుచు కల్యాణిని ముట్టడించెను. కోటలోనివారు పౌరుష ప్రతాపములు నెరపుచు యుద్ధము చేసిరి. బిజాపుర దండయాత్రాసందర్భమున "దేశమును కొల్లగొట్టండి. కల్యాణిలోని ప్రతి భవనమును, ప్రతి నిర్మాణమును కూలగొట్టండి. ఆ ప్రదేశమును గద్దలకును, గుడ్లగూబలకును నివాస యోగ్యముగా చేయండి" అని ఔరంగజేబు తన పరివారమునకు పదేపదే తాఖీదులు పంపసాగెను, కోటచుట్టునుండిన కందకమును పూడ్చిరి. కోట బురుజులపై ఫిరంగులను గురిపెట్టి కాల్చి పడగొట్టిరి. కోటగోడ

లను కూలగొట్టిరి. ఔరంగజేబు అనుకొన్నంత పని జరిగెను. ఈ పురాతన పట్టణము సంపూర్ణ వినాశముపాలు కావుటకు ఔరంగజేబుయొక్క మతోద్రేక చిత్తవృత్తియు శతమును మూల కారణములని చరిత్రకారులభిప్రాయ పడుచున్నారు.

కల్యాణి పట్టణము అత్యంత వైభవదశలో నున్నప్పుడు సువిశాలమయి, జనాకీర్ణమయి, మహోన్నత దేవాలయములకును, రాజప్రాసాదములకును, రమణీయ మందిరములకును, సుందరోద్యానములకును తావలమయి యుండియుండుననుటకు లందేహములేదు. ఇప్పుడు వాటిజాడలేమియు కనబడవు. శిథిలావశేషములగు నిరాకారపు మట్టిదిబ్బలు ఇప్పుడు మనకు ఎల్లయెడ నేత్రగోచరమయి వైభవ సంపన్నమయి ప్రకాశించిన ఆ చాళుక్య రాజధాని పూర్వరంగమును స్మరింపజేయుచుండును.

చీనా దేశపు బౌద్ధ యాత్రికుడగు హ్యూయనుత్సాంగు వ్రాతలవలన పురాతన సంస్కృతి కొంతవరకు గోచరమగుచున్నది.

ఇచ్చటి భూసారము ఫలవంతమైనట్టిది. ఇచ్చట ధాన్యాదులు పుష్కలముగా పండుచుండెను. ఇచ్చట వాతావరణము సమశీతోష్ణముగా నుండెను. సత్సంప్రదాయములు ప్రచారములోనుండెను.

ఇచ్చటి జనులు దీర్ఘకాయులు. పౌరుషవంతులు. ఎట్టి

అవమానమును గూడ సహించెడివారు కారు. శరణుజొచ్చినవా రిని రక్షింపుటకు వెనుదీసెడివారు కారు. తమకు ద్రోహముచే సినవారియెడ ప్రతీకారచర్య తీసికొనదలచినచో, తమ శత్రువునకు ముందు తెలుపకుండ నుండెడివారుకారు. రాజు గారి కొలువులో వందలకొలది శూరభటులుండెడివారు. వారు యుద్ధమునకు బోవునపుడు మత్తు పదార్థములను బాగుగ సేవిం చెడివారు. అట్టిస్థితిలోనున్నవాడు ఒక్కొక్క బల్లెమును మా త్రము కేలధరించి పదివేలమంది శత్రువులను ఎదిరింప గలుగు చుండెను. ఇట్టి భటసమూహమును చూచుకొని రాజు గర్వించు చుండెను. సేనానాయకు డెవడయిన యుద్ధమునందోడిపోయి నచో వానికి దేహదండన విధించుటకు మారుగా వాడు ఆడు దానివలె చీరను, రవికను ధరించునట్లు చేసెడివారు. అట్టి అవ మానమును భరించలేక వాడే ప్రాణములను త్యజించు స్థితికి తెచ్చుచుండెడివారు.

ఇచ్చటి జనులు విద్యా ప్రియులుగా నుండిరి. నూరారు మఠములుండెను. వీటిలో సుమారు అయిదువేలమంది నైష్ఠి కులుండుచుండిరి. వందలకొలది దేవాయతనములుండెను. వివిధ మతావలంబులకు ఆవాసమయి యుండెను. నగరములోపలను వెలుపలను పెక్కుదివ్యస్తూపములు విలసిల్లియుండెను. వీటిఅన్ని టియందును గత నలుగురు బోధి సత్వులు అధిష్ఠించి తమ పాద చిహ్నములను నిలిపియుండిరి. ఈ దివ్యస్తూపములను అశోక వర్ధన మహారాజు నిర్మాణముచేసెను. ఇంకనెన్నో స్తూపములుం డెను. ఇవియన్నియు రాతిని, ఇటుకలను ఉపయోగించి కట్ట బడినట్టివి. పట్టణమునకు దక్షిణముగా కొద్ది దూరమున ఒక

పురాతన బౌద్ధారామముండెను. దీని మధ్యభాగమున అవలోకి తేశ్వరబోధిసత్వుని శిలావిగ్రహముండెను. ఇతడు వీరప్రదాత గానుండెను.

పురాతన కల్యాణి పట్టణము మతదృష్టిలోకూడ ప్రఖ్యాతి వహించెను. కాలచుర్య రాజగు బిజ్జలుడు రాజ్యము చేయుచున్న కాలములో బసవన్న మంత్రిగానుండెను. ఈతడు వీర శైవ మత స్థాపనాచార్యుడయ్యెను. ఈ మత సాంప్రదాయకులను లింగాయతు లనెదరు. బసవనారాధ్యుని సోదరిని రాజు పెండ్లాడెను. రాజుగారితో గల బాంధవ్యమువల్లను, మంత్రిత్వ పదవి వల్లను బసవనారాధ్యుడు అధికార శిఖరమునందెను. తన నూతన మత విధానము నవలంబించిన వారినే రాజోద్యోగములందు నియమింపసాగెను. ఈ మతములో వర్ణభేదమునుగూర్చిన పట్టింపు కొట్టివేయబడెను. ఇందు చేరినవారు ఏ కులమువారయినను సరే శివప్రతినిధులగు జంగమదేవరలు. బసవేశ్వరుడు నందికేశ్వరుడు. లింగాయతులు మద్య మాంసములను వర్జించి పాకశుద్ధియందును, భోజన విధియందును కఠిన నియమములను పాటించుచుండిరి. శివలింగము, నందీశ్వరుడు వీరు పూజించు దైవములు.

బసవన్న మతము ప్రచండముగా కల్యాణిపురమునను, రాజ్యమునను విజృంభించెను. తన్మత విరుద్ధులను బసవనారాధ్యుడు నిర్దాక్షిణ్యముగా వధించెను. ఈ వధకథావిధానములో రాజు బిజ్జలుడుకూడ తన ప్రాణములను గోల్పోయెను. ఆంధ్ర కర్ణాటక దేశములనుండి బౌద్ధ జైన మతములు కూకటివేళ్లతో

పెళ్లగింప బడుటకు వీరశైవ మతము ముఖ్యకారణమాయెను.

ఆ కల్యాణి పట్టణము నశించినది. అచ్చటిప్రజల పౌరుషము నశించినది. ఇప్పుడదియొక కుగ్రామమయి ఒక నవాబుగారి జాగీరుగ్రామముగా "కల్యాణి" పేరుతో నిలచియున్నది.

కల్యాణి పట్టణమునకు అనతిదూరమున నారాయణపురముగలదు. ఇదియొక తటాకతీరమున కట్టబడినది. చాళుక్యుల కాలములో నిదియొక పుణ్యస్థలముగా నుండెను! శిల్పనైపుణ్యశోభితములగు రాతిచెక్కడములు, విగ్రహశకలములు లండనులోని ఇండియా మ్యూజియము భవనము నలంకరించుచు, కల్యాణి ప్రాంత శిల్పసంపదను, వైభవమును జాటుచున్నవి.



# కొండాపుర కథనము.

కాలపురుషుని ప్రభావముచేత భూగర్భమున మటుమాయమయిన ఆంధ్రనగరము లెన్నియో ఈ హైదరాబాదు రాష్ట్రములో కలవు. అట్టి ఆంధ్ర నగరములలో నొక్కటియగు నట్టిది కొండాపురము. ఈ కొండాపురమను ప్రాచీన*పట్టణముయొక్క యునికి మొన్న మొన్నటివరకు భారతీయ చరిత్రకారులు కనివినియెరుంగని నూతన చరిత్రాంశము.

ఈ కొండాపురము ఇప్పుడొక చిన్న గ్రామముగా నున్నను, దాని ప్రాంతమునందు అత్యంత ప్రాచీనకాలమున అనగా రెండువేల సంవత్సరముల క్రిందట నొక ఆంధ్ర రాజధానీ నగరము విలసిల్లి, వైభవోపేతమయి యుండెననుట ఆంధ్రులకును, చరిత్రకారులకును ముదావహమగు విషయము గదా!

కొండాపురము హైదరాబాదునకు ౪౩ మైళ్ల దూరమున బిదరుకు పోవు రాచబాట సమీపమున మెదకు జిల్లాలో నున్నది. ఇదియొక చరిత్ర ప్రాధాన్యముకల స్థలమని కనుగొ విధమొక అకస్మాత్సంఘటనము. కొండాపురము కాపురస్థుడు

సయ్యదు హుస్సేను అను పేరుగలవాడు ఆర్ష శాఖలో భృత్యుడుగా నుండెను. పురాతన మాస్కీపుర ప్రదేశములను త్రవ్వుచుండినప్పుడు కనబడిన ఇటుకలను అతడు చూచి ఇట్టి యిటుకలే మా కొండాపురమునందును వర్షాకాలమున బయటపడుచుండునని ౧౯౩౯ లో అసిస్టంటు డైరక్టరుగానుండిన ఖాజా మహమ్మదు అహమ్మదుగారితో చెప్పెను. ఆయన యీ అద్భుతాంశమును స్మరణ పుస్తకములో వ్రాసికొని, కొంత తెరపిడి కలుగగానే కొండాపురమునకు పోయెను. ఆయన చేసిన ప్రథమ పరీక్షయందే అచ్చట నొక చరిత్ర సామగ్రి గని కలదని గ్రహించెను. అంతట ఆర్ష శాఖవారు ౧౯౪౧ మార్చి నెలలో త్రవ్వుట ప్రారంభించిరి.

ఈప్రదేశము ౭౦ ఎకరముల జొన్న చేను. అచ్చటచ్చట మంటిదిబ్బలు గనుపడుచుండెను. ఈ మంటి దిబ్బలకును కొండాపురగ్రామమునకును మధ్యగా నొక యేరు ప్రవహించుచున్నది. ఈ యేటి నరికట్టి యొక తటాక నిర్మాణము చేయబడినది. సప్త సంతానములలో నొక్కటగు తటాక నిర్మాణమునందభిమానులై పాఖాల, రామప్ప, లక్నారము మొదలగు తటాకములను నిర్మించిన కాకతీయ ప్రభువులే యీ కొండాపుర తటాకమును నిర్మించియుందురు. ఇట్లీ నదిని బంధించకుండినచో మంజీరా నదికిది మంచి ఉపనదియయి యుండియుండును. జలసమృద్ధిగల యీ నదీతీరముననే పురాతన పట్టణమును కట్టియుండిరనుట స్పష్టము.

ఆర్ష శాఖోద్యోగులు మొట్టమొదట పరీక్షగా నొక గోయి

త్రవ్వి, చుట్టును కందకాలు తీసిచూచిరి. ఆ పరీక్షాఫలితము ప్రోత్సాహకరముగా నుండుటచే, ఇక దాని అంతు తెలిసికొన వలయునని కృతనిశ్చయులయి పనిచేయసాగిరి. రెండుమూడడుగులలోతునకు త్రవ్వగానే ఇండ్ల శిథిలాలు కనబడెను. ఇంకను త్రవ్వుచుపోగా ఇటుకలతోను, మట్టితోను కట్టిన గోడలు, రాతి కాలువలు, కమ్మరికొలిమిలు, పెద్ద పెద్ద మట్టిగాబులు, స్తూపములు, చైత్యములు, విహారములు, కనబడినవి. ఇంకను భాండములు, విగ్రహములు, పూసలు, సొమ్ములు నాణెములు దొరకినవి. వీటిని పరిశోధించగా ఇదియొక పట్టణముగా నుండెననియు, వర్తకస్థానముగా విలసిల్లియుండెననియు వివిధ వృత్తులుగల కర్మకారులకు నిలయమయి పరిశ్రమ కేంద్రముగా నొప్పుచుండెననియు, టంకసాలగూడ నొకటి యుండెననియు, ప్రజలు బౌద్ధమతావలంబులనియు స్పష్టముగా తేలినది.

ఇచ్చట కుమ్మరులు, కమ్మరులు, కంసాలులు, ఉప్పరులు, వడ్రంగులు, మొదలగువారును, వివిధకళలయం దారితేరినవారును, భాగ్యవంతులును, బీదలును నివసించుచుండిరి. ప్రజల ధార్మిక విశ్వాసములు, వస్త్రాద్యలంకారములు, నాగరకతాదులు ఎట్టివిగనుండెనో అచ్చట దొరకిన వస్తుజాలమునుబట్టి యూహించుట కవకాశము కలుగుచుండెను.

ఇచ్చటి కుమ్మరి సామాన్యుడా? కాదు. చిత్రకళను, శిల్పకళను మేళవించిన ప్రతిభాశాలి. ఈతడు భాండారములనే గాక గాజులు, సొమ్ములుకూడ చేయుచుండెడివాడు. ఈత

ని భాండములు చిన్నవి, పెద్దవి పెక్కురకములుగా నున్నవి. ఎఱ్ఱమన్నే వాడుచుండెను. ఒకజాడి అసాధారణమయిన పనితనము గలిగి ఎత్తుగా నున్నది. ఒక భాండము తొమ్మిదడుగుల వలయము, మూడడుగుల లోతు గలిగి వన్నెచిన్నెలతో నిగనిగలాడుచున్నది. అతని భావనాబలము ఎంతగొప్పదో చూడుడు. మృణ్మయపాత్రములన్నియు ఎఱ్ఱగానుండి తళతళ మెఱయుచు, ఆకుపచ్చ, ఎరుపు, పసుపురంగులలో చిత్రాలంకార భూషితములయి పలుచగా, నాజూకుగా నుండి కుంభకారుని శిల్పకళా చాతుర్యమును జాటుచున్నవి. గృహోపకరణములుగానుండిన భాండములు సామాన్యముగానున్నవి. దేవపూజయందుపయోగించెడు భాండములపయి బౌద్ధమత సంబంధములగు సాంకేతిక చిహ్నములు చిత్రితములయి యున్నవి. ఈ చిహ్నములు ౧౫ కనబడినవి. ఒకదానిమీద త్రిరత్నములు చిత్రింపబడినవి. త్రిరత్నములనగా, బుద్ధంశరణంగచ్ఛామి, ధర్మంశరణంగచ్ఛామి, సంఘంశరణంగచ్ఛామి అను బౌద్ధమంత్రము. ఈ మంత్రమును త్రిశరణములనిగూడ అందురు. ఇట్టి త్రిరత్నాంకిత భాండములను పూజయందు అభిషేకతీర్థమున కుపయోగించు చుండిరట.

ఈ కుమ్మరివాడు కుండలనేగాక బోలు విగ్రహములనుగూడ తెల్లని మెత్తని మట్టితో చేసి త్రివర్ణములతో చిత్రించి, ఆవములో కాల్చి సిద్ధము చేయుచుండెడివాడు. ఈ విగ్రహములలో కొన్ని బోధిసత్త్వుడు, యక్షుడు, యక్షిణి, కుబేరుడు మొదలగు దేవతలరూపములని గుర్తింపబడినవి. కొన్ని జాతక

కథాభాగములను దెలుపునట్టివిగా నున్నవి. ఈ విగ్రహముల తలలపయి వివిధములయిన శిరోవేష్టనములుగలవు. బౌద్ధమతమునకు సంబంధించిన పద్మము, ధర్మ చక్రములు అందచందములతో నొప్పారుచుండెడివి కలవు. ఇవి అమరావతి శిల్పమును బోలియున్నవి.

సాధారణముగా చిత్రకారుడు సమకాలమువారి హావభావములను, వేషములను చిత్రించుట సహజము. ఈ యూహ సరియైనచో ఆర్యజాతినిగాక దాక్షిణాత్యులను బోలిన ఆవిగ్రహాలను బట్టి యానాటి ప్రజల రూపములను గ్రహింపగలుగుదుము. వారు తలలపై వివిధములయిన పాగాలు చిత్ర విచిత్రముగా ధరించుచుండిరి. మెడలో హారములు వేసికొనుచుండిరి. చెవులకు పోగులు పెట్టుకొనుచుండిరి. వారి జుట్టు, కట్టు విధములు తెలియనగు చున్నవి. కొన్ని విగ్రహములు ఆత్మానందమును సూచించు మందహాస ముఖవిలసితములు. కొన్ని విగ్రహములు ఆత్మశాంతిని సూచించు ధ్యానమగ్న విలసితములు. ఆంతరంగిక భావములను వ్యక్తీకరించుటయందును, శిల్పకళా విన్యాసమును బయలుపరచుటయందును ఇవి యజంతా చిత్రముల శోభకు ఎంతమాత్రము తీసిపోవు. జంతువులలో సింహము, ఎద్దు, గుఱ్ఱము, గొఱ్ఱెవిగ్రహములు దొరకినవి. ఒక స్త్రీ తన యొడిలో బిడ్డనుంచుకొని చేతిలో పిడిగల విసనకఱ్ఱనో ధర్మచక్రమునో, ధూపము వేయు పాత్రనో పట్టుకొని యున్నది. కొన్ని స్త్రీ పురుష విగ్రహముల ఎడమచేతిపై రామచిలుకో, పావురమో కూర్చుండియున్నది. విగ్రహము

లన్నిటియందును జీవకళ యుట్టిపడుచుండును.

మానసానందమును గూర్చునది హాస్యముకదా ! ఈ శిల్పి హాస్యప్రియుడుగా గూడ కనబడుచున్నాడు. కుంభకారుని మట్టి విగ్రహములలో కొన్ని యీవిషయమును తెలివిడి చేయుచున్నవి. ఆచట్టిముక్కు, ఆ వికారరూపములు, ఆలంబకేశములు, ఆజారుముడులు, ఆ ఒత్తుపెదవులు మనలను వెంటనే నవ్వించజాలి యున్నవి. ఆవల కట్టుపద్ధతులు, ఆసొమ్ముల సంపద, ఆతలగుడ్డలు అజంతా చిత్రములను తలపునకు తెచ్చుచుండును. ఇచ్చటి కుంభకారకళ భరతఖండమునం దపూర్వమయి ఆకళాచారిత్రమున నూతనాధ్యాయమునకు తోవతీయుచున్నదట !

ఇచ్చటి కమ్మరీడును గట్టివాడే. వీడు ఇనుముతో చేసిన కొడవళ్లు, గొడ్డళ్లు, పటకాలు, బాకులు, ఉలులు, మేకులు, నాగళ్లు, మొదలగునవి దొరకినవి. వీటినిబట్టి యిచ్చటి వారు వ్యవసాయ వృత్తిగలవారయి యుండిరని తోచుచున్నది. బల్లెముల అగ్రములును దొరకుటచే ఇచ్చట బల్లెములు చేయుచుండిరనియు, ఆపట్టణమున సైన్యముండియుండెననియు స్ఫురించుచున్నది. సైన్యముండుచోటు సామాన్య గ్రామముగా నుండదుకదా ! కొలుములు, తిత్తులు, కాల్చిన పనిముట్లను చల్లార్చుటకు పెద్ద పెద్ద నీళ్ళబానలు, కమ్మరంగళ్లు ఎక్కువ సంఖ్యలో కనబడినందున కమ్మరిపని అచ్చట భారీమొత్తుమీద సాగుచుండినట్లు మనము గ్రహింపవచ్చును.

ఇచ్చట దొరకిన రత్నసువర్ణ మయములగు సొమ్ములను భాగ్యవంతులు ధరించుచుండి యుండవచ్చును. వెండి, రాగి, దంతపు, ఆచ్చిప్ప సొమ్ములను సామాన్యులు పెట్టుకొనుచుండిరని అనుకొనవచ్చును. మరి బీదసాదల కొఱకుగాబోలు మన కుంభకారుడు అందచందములతో సొమ్ములను సృష్టించి వారి ముద్దుముచ్చటలు తీర్చినాడు. జపమాలలపూసలు, కంఠహారములు, కరకంకణములు శోభాయమానములుగా నున్నవి. రత్నాభరణములు, కృత్రిమ రత్నాభరణములు వివిధాకారములలో నున్నవి. కొన్ని గుండ్రనివి, కొన్ని కోలగానున్నవి, కొన్నిత్రికోణాకారముగలవి. కొన్ని అర్ధచంద్రాకృతినున్నవి. దొరకిన వాటిలో మట్టిసొమ్ములే యెక్కువగానున్నవి. ఆవములో కాల్చి తీసిన మట్టిగాజులు, మట్టిహారములు, మట్టితాయెతులు బీదవారు ధరించుటకేయుద్దేశింపబడినవి. తాయెతులు శృంగారమునకేగాక దయ్యాల పీడ వదలించుకొనుటకును ఉపయోగించుకొనుచుండిరి. భాగ్యవంతులు బంగారు కాసుల దండలు వేసికొనుచుండగా బీదల తృప్తికయి మన కుంభకారుడు బంగారు కాసులయొక్క వన్నె, రూపు, నాణ్యము, అందచందములతో దీటువచ్చునట్టి మట్టికాసులను సృష్టించినాడు. ఇట్టి మట్టి కాసులదండలు మెడలో వేసికొని బీదపడుచులు కులుకుచుండిరి కాబోలు. ఈ మట్టికాసులు క్రీస్తు శకపు మొదటి శతాబ్దపు రోమక నాణెములను బోలియున్నవి. కనుక రోమక నాణెము లచ్చట చలామణి యగుచుండెననియు, మనవారలు రోము దేశముతో వర్తక వ్యాపారములు జరుపుచుండిరనియు స్పష్టమగుచున్నది. క్రీస్తు శకము మొదటి శతాబ్దములో రోమక

మతాచార్యుడగు ఆగస్టను ముద్రిగల మేలిమి బంగారు నాణె మొకటికూడ అచ్చట దొరకినది. ఇచ్చటి స్వర్ణకారుడు, కుంభకారుడు ఒకరి నొకరు మించు పనితనమును ప్రదర్శించుటకు పరుగులు వేసినారు.

రాజరికముయొక్క ఠీవి స్వాతంత్ర్యము తెలిసికొనవలయునన్నచో సిక్కాయే ప్రబల సాక్ష్యము. కొండాపురములో శాతవాహన రాజుల సిక్కా ప్రచారములో నుండెను. ఇచ్చట సుమారు నాలుగువేల నాణెములు దొరకినవి. ఇందు ౧౦ వెండివి, ౧౦౦ పంచలోహములవి, ౫౦ రాగివి, మిగత నాణెములు సీసపువి. ప్రతి నాణెమునకు బల్లిగలదు. ఇట్టి బల్లి నాణెములనే 3-౪ వేల వండ్లక్రిందట భారతీయులు వాడు చుండిరి. ఇందు కొన్ని ఎట్టి లిఖితములు లేక సాంకేతిక చిహ్నలు గల ఆంధ్రనాణెములు. కొన్ని శాతవాహన వంశమునకు సంబంధించి ఇంతేకపూర్వము దొరకనట్టివి. వీటిపయి బ్రాహ్మిలిపిలో గాధలుకలవు. ఇంకొక విశేషమేమనగా, ఈ నాణెములు చేయుటకు నుపయోగించెడు అచ్చుదిమ్మెలుకూడ ఇచ్చట దొరకినవి. కావున ఆ దిబ్బప్రాంతము ఆ యాంధ్ర నగరములో నాణెమును పోతపోయు టంకసాల యుండుభాగమని ఆర్క్యాలాజీ శాఖాధ్యక్షులుగా నుండిన మిస్టరు గులాం యెజ్దాని గారు అభిప్రాయపడినారు. టంకసాలయుండు ప్రదేశము రాజధాని పురమో, దానితో సదృశ్యమగు పురమో అయి యుండును. ఇందు శాతవాహన వంశజులయిన గౌతమీ పుత్ర శాతకర్ణి, వసిష్టిపుత్ర పులమావి, శివశ్రీ పులమావి, యజ్ఞశ్రీ

శాతకర్ణి అను సామ్రాట్టులకు చెందినవని నాలుగు నాణెములు
స్పష్టపరచుచున్నవి. కొన్ని చతురాకారమగు సీసపు నాణె
ములు గలవు, ఇట్టివి ఇతఃపూర్వము ప్రకటితము కాలేదు. ఇది
యు శాతవాహనులవే. ఇచ్చట దొరకిన వెండినాణెములనుబట్టి
శాతవాహనులకు వెండినాణెములుకూడ నుండెనను క్రొత్త విష
యము తెలిసినది. కొన్ని రాజముద్రికలుకూడ దొరకినవి.
అందలి యక్షరముల స్వరూపమునుబట్టి అవి క్రీస్తుశకము
మొదటి శతాబ్దమునాటివి. అనగా సుమారు రెండువేల సంవత్స
రముల క్రిందటివి.

కొండాపుర భూగర్భములోని గృహనిర్మాణ విధానము
నిరాడంబరముగా నున్నను వాస్తుశాస్త్రజ్ఞుల శిల్పకళా వైదుష్య
మును ప్రస్ఫుటము చేయుచున్నవి. నివేశనగృహముల కేమి, దేవ
మందిరముల కేమి వివిధ పరిమాణములుగల యిటుకలతో గట్ట
బడినవి. ఈ యిటుకలను చెరువులోని బంకమట్టితో చేసి
యుండిరి. ప్రాకారకుడ్యముల కుపయోగించిన యిటుకలు ౨౩
అంగుళముల పొడవు. ౧౨ అంగుళముల వెడల్పు ౨ ౪ అంగుళ
ముల మందము గలిగియున్నవి. వలయాకారముగ నుండెడు
స్తూపములకును, చైత్యములకును వాడిన యిటుకల మూలలు
వంపులుగానుండి సరిచేయవలసిన అవసరములేకుండ ఒప్పి
యున్నవి. ఈ యిటుకలు ౨,000 సంవత్సరములనుండి చెక్కు
చెదరకుండ నుండుట ఎంత గణనీయమయిన విషయమో చూచి
తిరా! వాటి ప్రక్కలు నునుపుగానుండి పేర్చిపెట్టినప్పుడు అంద
ముగా కనబడుచుండును. ఇండ్లపైన పెంకులు గప్పుచుండిరి.

నేలకు గచ్చు చేయుచుండిరి.

ఇచ్చట మూడు విహారములు, రెండు చైత్యములు, మూడు స్థూపములు, ఒక దాగోబా ఇప్పటివరకు కనబడినవి. దాగోబా యనునది ధాతుగర్భము. ధాతుగర్భమనగా బుద్ధదేవునిదంతమో, అస్తికలో సమాధిచేసిన ఆలయము. ఒక విహారములో ౭గదులు కలవు. ౮,౫ గదులమధ్య ౫ అడుగుల ౨అంగుళముల వెడల్పుగల తోవకలదు. ప్రతిగది ౧౦ చదరపుటడుగులున్నది. బౌద్ధబిక్షువుల నివాసార్థము మూలలయందు కొట్టిడీలు గలవు.

ఈ విహారమునకు దక్షిణముగా రెండు చైతన్యములు కలవు. అందొకదాని లోపలిభాగము ౨౫ అడుగుల ౮ అంగుళముల పొడవు, ౧౦ అడుగుల ౮ అంగుళములు వెడల్పుకలది. మరొక చైత్యము ౨౭ అడుగుల ౮ అంగుళముల పొడవు, ౧౨ అడుగుల వెడల్పు కలిగియున్నది. ఒక స్థూపము ప్రాకారాంగణములో నున్నది. మరియొక స్థూపముయొక్క ఆ వర్తపు అడ్డుకొలత ౧౯ అడుగులున్నది. దేవమందిరములు కొన్ని యున్నవి గాని అవి చాల చెడిపోయియున్నవి. ఏవంవిధ విషయములను బట్టి ఆ నగరవాసులు బౌద్ధమతమునందు గాఢభక్తి కలవారయి యుండిరని తేలుచున్నది. ఇచ్చట బుద్ధదేవుని ప్రతిమ యొక్కటియు దొరకకుండుటచే ప్రజలు హీనాయన సాంప్రదాయమునకు చెందిన బౌద్ధులయి యుండియుందురని తలంపవలసి యున్నది.

ప్రతి గృహమునకును, ప్రతి అంగడికిని ఒకటో రెండో చక్కగా కట్టబడిన నేలమాళిగలు కనబడుచుండుట చోద్యముగా నుండగలదు. ఇట్టి నేలమాళిగలు అధికసంఖ్యలో నున్నవి. వీటిలోనే వివిధ నాణెములు, అచ్చుదిమ్మెలు, పవిత్ర విగ్రహాలు, అమూల్యాభరణాలు, పూసలపేర్లు మొదలగునవి దొరకినవి. వాటినమూల్యముగా భావించి భద్రముగా నచ్చట గుప్తపరచి యుండనోవు.

ఇంతవరకు చేసిన వర్ణనాంశములనుబట్టి కొండాపుర ప్రాంతమందలి శిథిలనగరము రెండువేల సంవత్సరముల క్రిందట విశిష్ట సభ్యత కలదియయి క్రీ. పూ 300 ల నుండి క్రీ. శ 200 ల వరకు అనగా ౫00 సంవత్సరములు సకల సంపద్వైభవములతో జనాకీర్ణమయి విరాజిల్లి యున్నట్లు చరిత్రకారుల భిప్రాయ పడుచున్నారు. శాతవాహన రాజన్యులు ప్రతిష్ఠానము (పైథన్)లో రాజ్యము చేయుచుండినప్పుడు వారికి ప్రాకార పరిఘాపరివృతములగు ముప్పది నగరములుండెనని ఆ కాలమునాటి పాశ్చాత్యులు వ్రాసియున్నారు. ఆ ముప్పదింటిలో నీ కొండాపురమొక మేలిపురమయి యుండవచ్చునని అనుకొనుచున్నారు. ఉత్తర భారతమునందు తక్షశిలానగరమునకు గల ప్రాముఖ్యము దక్షిణాపథమున నీ కొండాపురమునకు గలదని యిండియా గవర్నమెంటు అర్కియాలజీ శాఖాధిపతి రావు బహద్దరు కె యన్. దీక్షితులుగారు వచించియున్నారు. ఇంక నీ కొండాపురపు మహత్తు ఎంతగొప్పదో మీరే యోచించండి. ఇంకొక అద్భుత సారాంశమేమనగా, విదరు ప్రాంతమే ప్రాచీన విదర్భదేశమన్న

ఊహాసరియైనచో, ఈ కొండాపురము శ్రీకృష్ణుని అగ్రమహిషి రుక్మిణీదేవి జన్మస్థలమగు కుండినపురమయి యుండియుండు ననుటకు అవకాశము కలుగుచున్నది.

ఈ నగర జీవితపు జాడలు క్రీ. శ రెండవశతాబ్దాంతము వరకే కనబడుచున్నవి. కావున ఆకాలమందే యది నాశన మయియుండును. ఇది ఎట్లు నాశనమయినదో తెలియదు. భూకంపమువల్లనో, శత్రువుల దాడిఫలితముగానో, బౌద్ధమత క్షీణపరిణామముననో ఈ చక్కని ఆంధ్రనగరము నాశము పాలయియుండును. ఎట్లయిననేమి? కాలపురుషుడు తన ప్రభావమును జూపియున్నాడు. మన ఆర్కి శాఖవారి పుణ్యాన, ముఖ్యముగా శ్రీ ఖ్వాజా మొహమ్మదు అహమదు సాహేబుగారి సముచిత శ్రద్ధాభిమాన నైపుణ్యముల పర్యవసానముగ కొండాపుర వైభవోదంతమును వినగలుగు భాగ్యము ఆంధ్రులకు లభించినది.



# కొలనుపాక కథనము

కొలనుపాకపురము నల్లగొండ జిల్లాలో నున్న పురాతన పట్టణము. ఆంధ్రదేశములో ప్రాభవమును గోల్పోయిన మహాపట్టణములలో నిదియొక్కటియై యున్నది. ఇది యిప్పుడు నవాబు బహిరాముద్దౌలా బహాదూరువారి జాగీరులోని చిన్నగ్రామము. దక్షిణాపథములో రాజకీయముగను మతవిషయముగను గొప్ప కేంద్రస్థానముగా నుండి ప్రసిద్ధికెక్కియుండెననుటకు అచ్చట ఇప్పుడు దృగ్గోచరమగు శాసనములు, శిల్పచిహ్నములు ప్రబల తార్కాణముగా నుండగలవు.

ఈ పట్టణము కొలిపాక, కుల్పాక, కొట్టియపాక, కొళ్ళియపాక, కొట్టిపాక కొల్లిపాకె అను పేర్లతో శాసనములందు గనబడుచున్నది. ఇవిగాక బింబావతిపురి, వ్యాఖ్యనగరము, సరోవర కుటీరము, సోమశేఖరపురము, కుదుటపురి, కుళుదపురము అను నామములతో కూడ ఇది వ్యవహరింపబడుచుండినట్లు స్థలపురాణాదులు తెలుపుచున్నవి. కొలనుపాక అనునదియే వ్యవహారములోనున్నది. కొలిపాక మహాత్మ్యమను కావ్యమును గలదు.

ఈ పురమును గూర్చి క్రమానుసారముగా చరిత్రం

శములు తెలియుటలేదు. ఇచ్చట సుమారు ౫౦ శాసనములు దొరకినవి. ఇంకను ఎన్నో భూగర్భములో నున్నట్లు తోచుచున్నది. ఇప్పుడు బయటబడిన శాసనములనుబట్టి పండితులు చరిత్రిశకములను సంధించి, కథారూపమేర్పరచుటకు ప్రియత్నించుచున్నారు. ఈ శాసనములలో సుమారు ౧౫౦ సంవత్సరముల చరిత్రాంశములు తెలియుచున్నవి.

కల్యాణి పశ్చిమ చాళుక్యచక్రివర్తుల పాలనములో పదునొకండవ శతాబ్దమునుండి కొలనుపాకలో చాళుక్యరాజ ప్రితినిధులు ఉండి పరిపాలనము సాగించుచుండినట్లు కనబడుచున్నది. జగదేకమల్లుని పేరు సూచించు శాసనమొకటికలదు. ఇతడు మొదటి జగదేకమల్లుడయిన యెడల క్రీ. శ. ౧౦౪౨ నాటికే ఇది చాళుక్యరాజ్యములో నున్నట్లు తేలగలదు. క్రీ శ ౧౦౬౭ లో త్రైలోక్యమల్లన ప్రథమ సోమేశ్వర చక్రివర్తి పాలనలోనున్నట్లు శాసన మొకటి తెలుపుచున్నది. క్రీ. శ. ౧౦౭౬ నుండి ౧౧౨౬ వరకు రాజ్యము చేసిన చాళుక్య చక్రివర్తి ఆరవ విక్రిమాదిత్యుని ౫౦ సంవత్సరముల పరిపాలనా కాలములో రాజ ప్రితినిధులుగా, కందూరు తొండయ్య వ్యాళమహారాజు, బిత్తరపారుడు, త్రిభువనమల్లుడు, అనంతపాలయ్య అనువారలు కొలనుపాక నేలుచుండినట్లు శాసనములు తెలుపుచున్నవి. బిత్తరపాలుడనువాడు సంధివిగ్రిహియు, సేనాపతియునై యుండెను. అనంతపాలయ్య అనవాడు మహాసామంతాధిపతి. మహాప్రిచండదండ నాయకుడు. విబుధవరనాయకుడు, సుజనప్రిసన్నుడు, గోత్రిపవిత్రుడు. పరాంగనాపుత్రుడు

